శ్రీ రాములు.

# శ్లోకపూర్వకమైన భారతసావిత్రి.

---

ద్వారవత్యాంస్థితంకృష్ణం । సమాహూయయుధిష్ఠిరః । సంధ్యర్థం ప్రేషయామాస । కురూణాంపాండవైస్సహ । శ్రీకృష్ణో రథవేగేన గత్వావై హస్తినాపురం । విదురస్య గృహంగంతుం । చోదయామాసదారకం । విదురోదృష్టవాన్కృష్ణం । స్వాగతంతేమహాప్రభో । విదురఉవాచ । భవద్దర్శనమాత్రేణ కృతకృత్యోస్మిసర్వదా । అద్యమేసఫలంజన్మ అద్యమే సఫలంతపః । అద్యమేపితరస్తుష్టా । గోవిందేగృహమాగతే । జన్మాష్టమీచ । నవమీచచతుర్దశీచ । చాద్యాయనంచవిషువచ్చ దినత్రయంచ । అద్యైవపిండ పితృయజ్ఞ మఖస్యకాలో । దామోదరేచనవాసాగృహమాగతేతు ॥ శ్రీకృష్ణఉవాచ । సాధుసాధుమహాప్రాజ్ఞా । సర్వశాస్త్రవిశారద । ఇష్టంతేయద్వరంబ్రూహి । దదామికురునందన । విదురఉవాచ ॥ అక్షతాన్విప్రహస్తేన । మాతృహస్తేనభోజనం । పిండంచపుత్రహస్తేన । దేహిమేమధుసూదన । భోజనంవిప్రసంకీర్ణం బంధుసంకీర్ణమం

దిరం । శయనంసుతసంకీర్ణం । దేహి మేమధుసూదన । అనాయా సేనమరణం । వినా దైన్యేనజీవనం । అనాథాధితగోవింద । చరణస్యకుతోభవేత్ । కృష్ణస్యాగమనంశ్రుత్వా । రాజరాజ స్సుయోధనః । విదురస్యగృహంగత్వా చేసంవచనమబ్రవీత్ ॥ సుయోధనఉవాచ । భీష్మద్రోణావతిక్రమ్య । మాంచైవమధుసూదన । కిమర్థంపుండరీకాక్ష కృతంవృషలభోజనం ॥ శ్రీకృష్ణఉవాచ । శుద్ధంభాగవతస్యాన్నం । శుద్ధంభాగీరథీజలం । శుద్ధం విష్ణుపదధ్యానం । శుద్ధమేకాదశీవ్రతం । అశూద్రాభగవద్భక్తా । విప్రాభాగవతాస్మృతాః । సర్వవర్ణేషుతేశూద్రాయే హ్యభక్తాజనార్దనె । చండాలంమమభక్తానాం నావమన్యేత బుద్ధిమాన్ । అవమన్యేతమూఢాత్మా । రౌరవంనరకంవ్రజేత్ । భోజనంపృచ్ఛసేరాజ న్నాదరంకింనపృచ్ఛసే । భోజనంగతజీర్ణం స్యాదాదరంత్వజరామరం । ద్విషదన్నంనభోక్తవ్యం । ద్విషంతంనైవభోజయేత్ । పాండవాన్ద్విషసే రాజన్మమప్రాణాహిపాండవాః । సంప్రీతాన్నానిభోజ్యాని నోపభోజ్యాని వైరిణః । నచసంప్రీయసేరాజ న్నచాప్యాపద్గతావయం । ఆదరేణోపనీతాని । శాకాన్యపిసుయోధన । క్షీరంఘృతమమగాత్రాణి నామృతంమానవర్జితం । మమవాక్యంకురుశ్రేష్ఠశాంతింగచ్ఛసుయోధన । రాజ్యంతేపాంసమందత్వా యయాయం పంచోత్తరం శతం । గోత్రక్షయోనకర్తవ్యో । రాజాన్పంచోత్తరంశతం ।

నైద్యా పళపర్గాణిచా । జ్ఞాతంతుత్రియోదశే । పంచగ్రామా
ర్థినోంజక్ । పాండవాశ్చపరాధిప । ఇంద్రప్రస్థం యమప్రస్థ
మవంతీంవారణావతీం । దేహి మేచతురో గ్రామాక్ । పంచమం
హాస్తినాపురం । పంచగ్రామాక్ వృణీతోస్మిదత్వాతుశరణంవ్రి
జ ॥ సుయోధనఉవాచ । ఇంద్రప్రస్థంగురోర్దత్తంయమప్రస్థం
కృపస్యచ । భీష్మాయవారణవతీచావంతీ సూర్యసూనవే । వా
రణంగ్రామమస్మాకం । పంచగ్రామాఅనకత్రిమాత్ । ఏవం
చైవస్థితాగ్రామాక్ । శృణుదేవకినందన । సూచ్యగ్రేణ సుతీ
క్ష్ణేనయావద్భిద్యేతమేదిని ! తావంతామపినదాస్యామి । వినా
యుద్ధేనకేశవ॥ శ్రీకృష్ణఉవాచ । యదాయదా పశ్యసివానర
ధ్వజంధనుర్ధరం । పాండవమధ్యమంరణే । గదాప్రహస్తంబ
లినం । వృకోదరంతదాతదా దాస్యసిసర్వమేదినీం॥ సుయోధ
నఉవాచ । హిరణ్యవర్ణం పరిపూర్ణగాత్రం । మేఘోన్నతం
మత్తగజేంద్రవీర్యం । ఆదిత్యపుత్రం బహుశత్రునాశనం । ప
శ్యామికర్ణంరథ మారుహంతం ॥ శ్రీకృష్ణఉవాచ । ఏకాకీపా
దచారీచయదినాయాసికౌరవ । వక్తారోధర్మశాస్త్రాణాంమ
న్వాద్యామధ్యపాయనః॥ ద్రోణఉవాచ । నరేచతుష్కంతురగే
చషోడశంగజేశతం పంచశతంరథేషు । కృష్ణోర్జునోయుంచతిబా
ణవర్షం స్వాతీగతశ్శుక్రఇవాతివృష్టిం॥ సంజయఉవాచ । మే
దినీభారహరంపార్థసారథమచ్యుతం ప్రణమామిహృషీకే

శం । కేశవంచక్రపాణినం॥ శ్రీవేదవ్యాసఉవాచ । దుగ్ధభావిప్ర
గోష్ఠీచ । గంగాస్నానంచదుర్లభం । దుర్లభాహరిభక్తిశ్చదుర్ల
భాభారతీకథా । భారతఃపంచమోవేదోయః పఠేచ్ఛృణుయా
దపి । భారతస్యైకపాదంచ । గంగాదర్శనమేవచ । విష్ణో
స్మరణమాత్రేణ సర్వపాపైఃప్రముచ్యతే॥ సంజయఉవాచ । సా
రంభాగీరథీతోయం । సారంజాప్యంచవైదికం । బ్రహ్మచర్యం
తతస్సారంసారంమాధవసేవనం ॥ ధృతరాష్ట్రఉవాచ । బ్రూ
హిసంజయ యద్వృత్తంయుద్ధం తేషాంమహాత్మనాం । పాండ
వానాంకురూణాంచ సంప్రవృత్తేమహాక్షయే । కేతత్రవీరము
ఖాయోధాః । కేచతత్రమహారథాః । మహాబలాశ్చకేతత్ర ।
కథంతేనిహతారణే । భీష్మద్రోణౌకథంభగ్నౌ । కర్ణశల్యౌక
థంహతౌ । పుత్రాస్తుమేహతాః కేనరాజరాజస్సుయోధనః ॥
సంజయఉవాచ । శృణురాజన్ప్రవక్ష్యామి । యథాదృష్ట్యా
మ్యహాంస్ఫుటం । పాండవానాంబలేయోధాస్సర్వేవిష్ణుపరా
క్రమాః । కౌరవాణాంకులేయోధా । స్సర్వేసంకర్షణప్రభాః।
అర్జునస్సాత్యకిశ్చైవ । ధృష్టద్యుమ్నోఘటోత్కచః । శిఖండి
చాభిమన్యుశ్చ వాయుపుత్రోమహాబలః । నకులస్సహదేవశ్చవి
రాటోద్రుపదస్తథా । యుధిష్ఠిరపురోగాశ్చ । త్రయోదశమ
హారథాః । శకునిస్సౌబలోభీష్మః । కృతవర్మాజయద్రథః ।
భూరిశ్రవాస్తు బాహ్లీకోభగదత్తస్తథైవచ । ఉలూకస్సోమద

త్రశ్చ । శశిబిందుశ్చపార్థివః । ద్రోణో ద్రౌణిః కృపశ్శల్యో ।
వృషసేనో హలాయుధః । వైకర్తనో వికర్ణశ్చ కళింగశ్చ తథైవ
చ । దుశ్శాసనో విచిత్రశ్చ । రాజా దుర్యోధనస్తథా । చతుర్వీం
శతియుక్తాపై.। కౌరవేషుమహారథాః । భీష్మఉవాచ । అర్జున
స్సహపుత్రేణ । ద్రోణస్సహసుతేనచ । అహంభూరిశ్రవా
శ్చైవ । షడేతేతిరథాస్మృతాః । దేవదానవగంధర్వా । అసు
రాయక్షరాక్షసాః । అతితాస్త్రిషులోకేషు । యేనతేవితథాః
కృతాః ॥ భీష్మఉవాచ । అహమేకంత్రిభిర్ద్రోణః । పంచ
భిస్సూర్యనందనః । నిమిషంద్రోణపుత్రస్తు । నిమిషార్ధంధనం
జయః ॥ లక్ష్మణశ్శరసంధానె దురాపాతెచరాఘవః । దృఢ
ముష్టిస్తురాధేయః। స్త్రిగుణస్తుధనంజయః।ఆదిపర్వం।సభాపర్వం।
పర్వమారణ్యకంతథా। విరాటపర్వంవిజ్ఞేయం । చాతుర్థంతదనం
తరం । ఉద్యోగంపంచమంపర్వం । భీష్మపర్వంతతఃపరం । సప్త
మంద్రోణపర్వంతు । కర్ణపర్వంతతఃపరం।నవమంశల్యపర్వం
తు। గదాపర్వంతతఃపరం। ఇషీకంచతతఃప్రోక్తం।గర్భపాతన
మేవచ । త్రయోదశంతుస్త్రీపర్వం । ప్రినానముదకస్యచ ।
శాంత్యానుశాసనెచైవ । అశ్వమేధకమాశ్రమం । మాసలాఖ్యం
మహాపర్వం । మహాప్రస్థానికంతథా । స్వర్గారోహణపర్వం
తు హరివంశస్తథైవచ । ఇత్యష్టాదశసంఖ్యాక పర్వాణిమునిర
బ్రవీత్ । హేమంతెప్రథమేమాసె శుక్లపక్షెత్రయోదశెప్రిష్య

త్తంభారతం యుద్ధం నక్షత్రే యమదైవతే । ఫల్గున్యాంతు హ
తో భీష్మః । కృష్ణపక్షే తు సప్తమే । అష్టారథసహస్రాణి నవ
దంతిశతానిచ । రాజపుత్రసహస్రైకం । హత్వా భీష్మోన్యవర్త
తే । అష్టమ్యాం చైవ సౌభద్రో । నవమ్యాంచ జయద్రథః । దశ
మ్యాం భగదత్తస్తు మహాయుద్ధే నిపాతితః । ఏకాదస్యామర్ధరా
త్రే హతో ఘటోత్కచః । తతః ప్రభాతసమయే । విరాట
ద్రుపదౌ హతౌ । ద్వాదశ్యాం చైవ మధ్యాహ్నే ద్రోణాచార్యో
రణే హతః । రాజపుత్రసహస్రైక మశ్వానామయుతం తథా రథ
త్రిసంఖ్యలక్షాణి నృణాంలక్షాశ్చతుర్దశ । ధనుర్ధరో హతో
ద్రోణిర్హత్వా చైవన్యవర్తతే । త్రయోదశ్యాంతు పూర్వాహ్నే
వృషసేనో రణే హతః । చతుర్దశ్యాంతు మధ్యాహ్నే రాజాదు
శ్శాసనో హతః । తస్మిన్నేవ మహాయుద్ధే వర్తమానే చతుర్దశే ।
హతో వైకర్తనః కర్ణః । లంబమానే దివాకరే । నిశ్శబ్దతూర్యం
హతయోధముఖ్యం । ప్రశాంతదర్పం ధృతరాష్ట్రసైన్యం । న
శోభతే సూర్యసుతేన హీనం బృందం గ్రహాణామివ చంద్రహీ
నం । ముఖం కమలపత్రాక్షం పుణ్యం శ్రవణవర్జితం । తద్దైవకావం
సైన్యం కర్ణహీనం నశోభతే । వ్యూఢోరస్కం విపులవదనం ।
తప్తహేమావభాసం । కర్ణం దృష్ట్వా భువిని పతితం పార్థబాణా
వసక్తం । పాంసుగ్రస్తం మలినవదనం । పుత్రమన్వీక్షమాణో ।
మందం మందం పతతి సవితా మేదినీమందరశ్మిః ॥ శ్రీకృష్ణ ఉవా

చ । త్వయామయాచకుంత్యాచ । ధరణ్యా వాసవేనచ । జా మదగ్న్యేనరామేణ । షడ్భిఃకర్ణోని పాతితః । ఉలూకస్సోమ దత్తశ్చ । సహదేవేనపాతితః । యుధిష్టిరేణవీరేణ । మద్రరా జోమహాబలః । అమావాశ్యామద్ధరాత్రె । రాజాదుర్యోధనో హతః । కథందుర్యోధనోరాజా । భీమసేనే నపాతితః । గద యాతాడితశ్చాసీ । ద్భీమసేనో వ్యమర్షణః । సంజయఉవాచ । నభూతందాదృశంయుద్ధం క్షత్రియాణాంతరస్వినాం । అన్యథా భావితంయుద్ధం । చక్రిణాకృతమన్యథా । దృష్టద్యుమ్నశ్శిఖం డీచ । ద్రౌపద్యాఃపంచచాత్మజాః ఏవంమష్టా దశంఘ్నంతి అక్షోహిణ్యాందినేదినే । దినానిదశభీష్మేణ । భారద్వాజేన పంచచ । దినద్వయంతు కర్ణేనశల్యే నార్ధదినంతథా । దినార్ధం తుగదాయుద్ధమే తద్భారతముచ్యతే । నవనాగసహస్రాణి ర థాశ్వపసచారిణః । స్వపూర్వస్త్రచ్యుతగుణా । భవేయుశ్చో త్తరోత్తరాః । సర్వక్షేత్రేకురుక్షేత్రే । సమక్షేత్రే మహోత్త మాః । పార్థేనపాత్రిషితాస్స్వర్గం । రాజపుత్రాయశస్వినః । ర ణనంజ్ఞేన యజ్ఞేనదీక్షితోయం యుధిష్ఠిరః । వేదింకృత్వా కురు క్షేత్రం । యూపంకృత్వాజనార్ధనం । సూత్రంతు సహదేవంచ మంధానం నకులంతథా । దుర్యోధనంపశుంకృత్వా । వహ్నింకృ త్వావృకోదరం । హోతారమర్జునంకృత్వా । భీష్మద్రోణౌమ హావిః । గాండీవేనస్వరేణైవహుతా యుమానేషు రాజను । అయా

చితమిదంద్రవ్యం । హాయా మేధవివర్జితం। ఇమాంభారతసావిత్రీం।
ప్రాతరుత్థాయయఃపఠేత్ । దివావాయదివారాత్రౌ । సమేషు
విషమేషుచ । అహోరాత్రకృతంపాపం । క్షణమాత్రేణనశ్య
తి । నభయంవిద్యతేకించి । కార్యసిద్ధించగచ్ఛతి । యత్ఫలం
గోసహస్రస్యస్వర్ణా లంకృతిగస్యతత్ । విందేద్దత్తస్యపా
త్రేషు వ్యాసస్యవచనం తథాశృణ్వంతోయే పఠంతోయే । వి
ష్ణోర్మాహాత్మ్యముత్తమం । సర్వపాప విముక్తా యాస్యంతిపర
మాంగతిం । యోగోశతం కనకశృంగమయం దదాతి । విప్రా
య । వేదవిదుషేచ బహుశ్రుతాయపుణ్యాంచ భారతకథాం ।
పఠతిశృణోతి । తుల్యంఫలంభవతి తస్యచతస్యచైవం । ఇతిశ్రీ
వ్యాస ప్రోక్తాభారత సావిత్రీసంపూర్ణా॥



# శ్రీరస్తు.

---

# భారతసావిత్రి.

---

శ్రీరామాశ్రితాప్త। త్సారసరవిభాను వంశసాగ
రచంద్రా। భూరిదయారససాంద్రా। పాతసపత్రా
త్మరామచంద్ర నరేంద్రా॥ * * *

## వచనము.

అవధరింపుము - ధర్మరాజు ద్వారకా నగరంబుననున్న శ్రీకృష్ణదేవునింబిలిపించి కౌరవులకుఁబాండవులకును సంధి సేయవలయునని ప్రార్థించి రాజ్యభారంబును పవద్దేవుండు నట్లగు గాక యని హాస్తినాపురంబునకువచ్చి తన సారథియైన దారకునింబిలిచి విదురునింటికి రథంబుపోవవిమ్మనిన నతండట్లచేసెను. అంతవిదురుండు గోపాలదేవునెదుర్కొని సాష్టాంగ దండప్రణామంబులాచరించి లోకనాయకా, మేలుగలుగ విజయముచేసితిరి మీ చరణారవిందంబులు గనుగొనుటవలన నేనెల్లభంగులఁ గృతార్థుండనైతి

నిప్పుడు నాజన్మంబు సఫలంబయ్యె నాతపంబు ఫలించె నాపుణ్యంబులీడేరె దామోదరా, మీరు నాగృహంబునకు వేంచేయుటం జేసి జన్మాష్టమియు - మహానవమియు - ననంతచతుర్దశియు - దక్షిణాయన పుణ్యకాలంబు - నుత్తరాయణ సంక్రాంతియు - తులా మేషసంక్రాంతియు - దశమియు - నేకాదశియు - ద్వాదశియు - నమావాస్యయు లోనుగాగల పుణ్యదినంబులు మాకు సమకూరెననుటయు - నవ్వేసు దేవనందనుండు విదురునిం జూచి యతిశయించిన ప్రజ్ఞయు సకలశాస్త్రజ్ఞానంబు నుగల నీ పలుకులకు మెచ్చితి గావలసినవరంబులు వేడు మిచ్చెద ననిన నవ్విదురుండు సంతోషించి పురుషోత్తమా, నాయింట వేల కొలది బ్రాహ్మణులు భుజింపవలయు - నామందిరంబున బంధుజనంబులు నిండియుండవలయు - నేశయునిం దుకిరి కొడుకులు మాతుంత్రులును గలసి సందడిగా నిండియుండవలయు - నిట్టివరంబు దయ చేయవలయు ననిన నద్దేవుండట్లయగు గాక యనివరం బొసంగె, * అంత శ్రీకృష్ణదేవుని రాక నెరింగి - రాజరాజగు దుర్యోధనుండు విదురుని సదనంబునకు వచ్చి మధుసూదను నవలోకించి కమలాక్షా, భీష్మద్రోణుల నుల్లంఘించి మాయింటికి రాక శూద్రుని యింట భుజియించుట యర్హంబె యనవిని రుక్మిణీవల్లభుండు సుయోధనుం జూచి యిట్లనియె. పరమభాగవతోత్తముని యన్నంబును - గంగాతోయంబును - శ్రీవిష్ణుదేవుని పాదపద్మ

ధ్యానంబును - ఏకాదశీవ్రతంబును - పరిశుద్ధంబని పెద్దలవలన నెఱుంగవే - విష్ణుభక్తిపరాయణుండైన మనుజుండు నాలవజాతిని జన్మించినవాడైనను శూద్రుండుగాడు - పరమభాగవతోత్తముండైన బ్రాహ్మణుండనంబరగు - సకలజాతులయందును విష్ణుభక్తిలేనివాడు శూద్రుండనంబరగు నాయెడ భక్తిగలిగినవాడు చండాలుడయిన నవమానించుట బుద్ధిమంతులకు నుచితంబు గాదని యెఱుంగక నాభక్తులదూషించిన నరాధములు రౌరవాది నరకంబులం జెందుదురు * రాజేంద్రా, యాదరంబుముదుగ వలయుంగాని భోజనంబునకుంబనియేమి? యన్నంబు క్షుధాములో నజీర్ణంబగు - యాదరంబు శాశ్వతంబయి యుండుం బగవాని యింట భుజియించుటయుం బగతునికిభోజనం బిడుటయు నర్హంబుగాదు - నీవుమాకుం బగవాడవగుటంజేసి నీ యింట భుజియింపరాదది యెట్లంటేని పాండవులుమాకు బరమాప్తులౌటం జేసి వారియెడంజేసిన యపరాధంబు మాయందు నిత్యంబయ్యె - మాకుంబాండవులు ప్రాణపదంబగుట యెఱుంగవే? ప్రియపూర్వకంబుగా బిలిచినవారియింట భుజియించుట యుచితంబు - అన్నంబులేకున్న నాపత్కాలంబున నెవ్వరింటనయిన భోజనంబుసేయందగును - మీకుమాయెడ ప్రేమలేదు - మేముఅన్నంబు లేనివారముకాము. సుయోధనా, యాదరంబు మీఁదనొసంగిన శాకమాత్రింజేసియు మామనంబున నమృతోపమానంబయియు

డును - భక్తిలేకయిచ్చిన యమృతంబేని నిస్సారముగా నె
న్నుదుము - నాపలుకులు వినగలవాడవంటే నీదురభిమానంబు
విడిచి పాండునందనులకు సగభాగంబుగా భూమిపంచియిచ్చి
మీరునూరుగురును - వారైదుగురును గలిసిసుఖంబున నుండవల
యుఁ గులంబునకు హానిదేవలదు - మీరునూటయేవురు నేకీభ
వించియుండుట కార్యంబు * అదిగాక కాననాంతరంబున
నం బండ్రెండేండ్లు వనవాసంబును - నొకయేడజ్ఞాతవాసంబును
జేసివచ్చిన ధర్మనందనాదుల కేవురికి నైదూళ్లడుగుచున్నా
వారు - * అవియేవియనంటేని - ఇంద్రప్రస్థంబును - నవంతి
యు - యమప్రస్థంబును - వారణావతంబును - నివి నాలుగు
గ్రామంబులు - ఐదవది హస్తినాపురంబునుం గోరుచున్నవా
రు - గావున - నవశ్యంబు నివియివ్వందగినవి యనినవిని దుర్యో
ధనుండు శ్రీగృష్ణదేవునింజూచి యిట్లనియె." కేశవా - కయ్యం
బుసేయకగాని యేనువాడిగల సూదిమొనమోపిన మాత్రంబే
నియు భూమి బంచియివ్వంగలవాఁడనుగాను- అనుటయు
శ్రీకృష్ణదేవుండు దుర్యోధనుంజూచి యిట్లనియె, ధృతరాష్ట్ర
నందనా - కపిధ్వజంబును గాండీవంబును మెఱయఁ బాండవమ
ధ్యముండయిన యర్జునుండు, నుద్దండ గదాదండంబు మెఱ
యఁ బిరబిరం ద్రిప్పుచు వేదండంబునుంబోలె వృకోదరుండును
రణంబునకువచ్చి నిలిచినప్పుడు సకల రాజ్యంబును నీవేపంచి

యీచెప్పెదవనిన విని దుర్యోధనుండు శ్రీకృష్ణ దేవునింజూచి యిట్లనియె. * కుందనంబుచందంబుననందంబగు దేహకాంతులు వెలుంగ మనపుత్రులనఁగు విడివడినకరణి మహామేఘంబునుంబోలె గర్జిల్లుచు - నెదిరించిన శత్రుసైన్యంబులను క్కడంచుచు నారథంబు త్రిగతులనడిపింపఁజేయుచు - నా దివ్యనందనుండయిన కర్ణుండు సమరంబునందేజరిల్లు నెడ నీవు చూడగలవాడవనిన - శ్రీకృష్ణదేవుండు సుయోధనుంజూచి యిట్లనియె . * ఈబలంబును నమ్మితివేని నీవు యేనుంగులు గుఱ్ఱంబులు రథంబులు లేక యొంటరివై చిక్కి పాదచారంబున బలాయనంబు సేయంగల వాడవని శ్రీకృష్ణుండు మఱియు సుయోధనుంజూచి యిట్లనియె - నట్లుగాక యుండ నేనిధర్మశాస్త్రకర్తలును - యాజ్ఞవల్క్య ప్రభృతులును - మద్యపానంబుజేసినవానియట్లు అసత్యవాదులౌదురుగాక - ఉత్తర గోగ్రహణంబునఁ దలపోగలలోచనవిచ్చినప్పుడు పరాజయంబునొంది మగుడియుద్ధంబునకుఁబూనిన దుర్యోధనుం డొక్కరుండుఁ, దొల్లి త్రేతాయుగంబున నాంజనేయుం డొక్కరుండువచ్చి లంకనిశ్శంకఁజొచ్చి యశోకవనంబు విఱిచి తన పుత్రుండయిన యక్షునింజంపి లంకానగరంబుదహించి జయంబు చేకొనుట యోచించి మఱలఁగయ్యంబునకుఁబూనిన రావణుండొక్కరుండు - మీరిరువురు పురుషులు లోకంబున

మూర్ఖులనంబలగుదురనుటయు - ద్రోణాచార్యుం డిట్లనియె కృష్ణార్జునులే కీభవించి శుక్రుండు స్వాతిగతుండై యతివృష్టి గురియుచందంబునఁ గాల్బలంబులమీద నాలుగేసి బాణంబు లు - నశ్వంబులపైఁ బదునారేసి సాయకంబులును యేనుగుల మీద నూరేసి యమ్ములును - రథంబులపై నూరేసి విశిఖం బులనేసి బాణవర్షంబు గురియింపగలవారనిన, * అంత ట సంజయుండు ధృతరాష్ట్రు నుద్దేశించి కేల్మోగిచి సా ష్టాంగ దండప్రణామంబాచరించి స్వస్తి శ్రీకర శ్రీకంఠ వర ప్రసాద సహస్రనాగబల సంపన్నుండైన అగ్ని స్తంభ జల స్తంభ ఇంద్రజాల మహేంద్రజాల విద్యా సంయుక్తుండైన ధృతరాష్ట్ర, నీనందనుండగు దుర్యోధన చక్రవర్తి నూరుగురు తమ్ములును - నూటయొక్క తనయులును నిరువదివేల లక్ష బంధువర్గంబులును - నూరుకోట్లనియోగులు - నేడుకోట్ల యురోనిసంభవులును - బదునాలుగుకోట్ల లలాటపట్టవర్ధనలు ను - మూడుకోట్లదండనాయకులును - జతుష్కోటిసామంతు లును - గోటియాటెక్కోలలవారును - దుష్టాపతులును - లక్షయు నేబదివేలఁ బానిసలును కోటితొమ్మిదిలక్షల శుద్ధవీరులును - నలు వదివేలపిరవిండ్లవారును నాలుగులక్షలసంగ్రామవిజయులును - బదియేనులక్షలభద్రజాతియేనుగులును - నైదులక్షలసంగ్రామ దంతులును - నాఱులక్షలమహామంత్రులును - యేడులక్షల

డెబ్బదితొమ్మిదివేలవర్షంబులును గలిగి - విభవంబుతోడ నేలినది హస్తినాపురంబు నెక్కినదికనకరథంబును జెక్కినది మాణిక్యకిరీటంబును దన పేరు రాజ రాజనివహించి - నిత్యకళ్యాణంబును - బచ్చులతోరణంబులుంగలిగి - నవఖండమండలాధీశ్వరుండై - యూరుఖండంబుల - దానేలుచు మూడుఖండంబులవారిచేతం గప్పంబులుగొనుచు గన్నులఁజింతామణియుఁ - జేతులస్పర్శవేదియుఁ - బాదములబద్మరేఖలుగలిగినట్టిదుర్యోధనచక్రవర్తికి వైరియై - భూభారంబుహరియింపంగోరి సారథ్యంబుసేయం బూనిన - యచ్యుతునకు - హృషీకేశునకుఁ - త్రివిక్రమునకుఁ జక్రధరునకు - శ్రీకృష్ణదేవునకు - దండప్రణామంబుగావించితి ననియె - తదనంతరంబున వేదవ్యాసమునీంద్రుండు - ధృతరాష్ట్రునకిట్లనియె * బ్రాహ్మణులతోడిసద్గోష్ఠియు - గంగాపానంబును - విష్ణుపాదసందర్శనంబును - భారతకథాశ్రవణంబును - నయిదవవేదంబనంబరగు - భారతంబున నొక్కశ్లోకంబున నగంబైనవినుటయు వీనిచే సకలపాపంబులును దొలంగునని భారతరణప్రకారంబు ధృతరాష్ట్రునకువినుపింప సంజయు నియోగించినరిగె * అంతధృతరాష్ట్రుండు సంజయుంగనుంగొని మహాత్ములైనపాండవులకుఁ గౌరవులకు ఘోరయుద్ధంబు వాటిల్లునెడ నిరువాగులనెవ్వరెవ్వరు మొనమానిసులైయుండిరి - ఎవ్వరెవ్వరతిరథ మహారథసమరథార్ధరథాదిరథశ్రేష్ఠులు - ఎవ్వ

రెవ్వరుహతులైరి భీష్మద్రోణులెత్తెరంగునబడిరి దుర్యోధనుండు భీమసేనుచేతనెత్తెఱంగునంబడియె. నదిసవిస్తరంబుగవినుపింపు మనుటయు - సంజయుండుధృతరాష్ట్రునుద్దేశించి యిట్లనియె * కౌరవబలంబులోన సుయోధనుండును కృతవర్మయు - శల్యుడును - భూరిశ్రవుండును - బాహ్లీకుండును - సోమదత్తుండును - హాలాయుధుండును - నతిరథులును - సైంధవుండును నీలుండును - వృషసేనుండును - మహారథులును - బృహద్బలుండును - శకునియు - భగదత్తుండును - లక్ష్మణకుమారుండును - సమరథులును - దండధారుండును - గర్ణుండును - విందాను విందులును అర్ధరథులు - సుకృపుండును - నశ్వత్థామయును - ద్రోణుండును - భీష్ముండును - అతిరథశ్రేష్ఠులును - పాండవ సైన్యంబున యుధిష్ఠిరుండును - గుంతిభోజుండును - నతిరథులును - భీముండును - నభిమన్యుండును - సాత్యకియును - దృష్టద్యుమ్నుండును - ఘటోత్కచుండును - అతిరథశ్రేష్ఠులును - నకులసహదేవులును - చాంత్యుండును - సమరథులును - ద్రౌపదీపుత్రపంచకంబులును - ఉత్తరుండును - ద్రుపదమాత్స్యులును - శిఖండియును - దుష్టకేతుండును - మహారథులును - విభ్వత్సుండెక్కరంబువాడని నాకు వాకొననీకునూగొనవల్లకాదు పదునెనిమిది యక్షౌహిణులొక్కటికైయెత్తివచ్చెనేనియు నొక్కడ నిమిషమాత్రంబున సంహరింపనోపు- ద్రోణుండుదివ్య

ష్ములు - శల్యుండర్ధ దినంబును బొంది దుర్యోధనుండర్ధ
దినంబు గదా యుద్ధంబు చేసి భీమసేను చేతసమసె - సకల క్షత్రియ
యాకారణంబుగ కురుక్షేత్రంబున నిత్తెరంగున భారతయుద్ధం
బు పరిశస్తంబయ్యె - తొమ్మిదివేల సేనంగులు - సేనంగునకు
నూరేసి రథంబులును - అరదంబునకు వెయ్యేసి గుఱ్ఱంబులును
గుఱ్ఱంబునకు నూర్వురు కాల్వురులును నిది ధర్మనందనునకు
మూలబలంబు. కురుక్షేత్రంబు యజ్ఞవేదియు జనార్దనుండు
యూపంబును. దుర్యోధనుండు పశువు - కర్ణుండు నారిస్సు
పాంచాలియరణియు - భీమసేనుండగ్ని అర్జునుండు
హోతయు - భీష్మ ద్రోణులాజ్యంబు - ఈ రణమ్మను యాగ
మ్మున ధర్మరాజు యజమానుడయి గాండీవంబనియెడు
స్రుక్స్రువంబుల చేత సమస్త రాజ సంఘంబులనియెడు హవ్య
ద్రవ్యంబుల హోమంబు చేయించె - యిది భారతసారి
సంగ్రహంబు భారతసావిత్రియనంబరగు ఎవ్వరేనియు నిది ప్రాతః
కాలమున - మధ్యాహ్నంబున సాయంసమయంబున సంకట
కాలమున భయముదోచినయెడ నీభారతసావిత్రి పఠయించిన
వారికి సకలకార్యములు సిద్ధించి - సంవత్సరోపార్జితంబులగు
దురితంబులు వొలంగు. స్వర్ణమాలి కాలంకృతములగు వేయి
ధేనువులు సత్పాత్రమున దానము చేసినఫలము గలుగును -
వేదవ్యాస వచనము గలదు,*

వినిన వారికిఁ జదివిన వారికి గలిమి బలిమిఁచే
నెలమిగలిగి – పుత్రపౌత్రాభి సామ్రాజ్యవృద్ధి
గలిగి తదనంతరంబున విష్ణుసాయుజ్యంబు గలుగును

భా ర త సా వి త్రి

సంపూర్ణము.



త్రయంబునను - గర్ణుం డైదు దివసంబుల నశ్వత్థామయర్ధ దినంబు- పాండవబలంబుల దెగటార్చిరు. అర్జునుండొక్కరుండ మనబలంబుల నర్ధనిమిషమ్మునంబ్రతారించి దోలించుననిచెప్పి వెండియుసంజయుండిట్లనియె * ఆదిపర్వమును - సభాపర్వ మును - అరణ్యపర్వమును - విరాటపర్వమును - ఉద్యోగపర్వ మును - యివియాదిపంచకంబు - భీష్మపర్వమును - ద్రోణపర్వ మును - కర్ణపర్వమును - శల్యపర్వమును - సౌప్తికపర్వ మును - యివి యుద్ధపంచకంబు - స్త్రీపర్వమును - శాంతి పర్వమును - అనుశాసనికపర్వమును - యివి శాంతిత్రయ ములు - అశ్వమేధపర్వమును - ఆశ్రమవాసపర్వమును - మౌసలపర్వమును - మహాప్రస్థానికపర్వమును - స్వర్గారోహణ పర్వమును ఇవియశ్వమేధపంచకంబు * ఈపదునెనిమిది పర్వ ములుకృష్ణద్వైపాయనుండు రచియించె - మార్గశీర్ష మాసమున శుక్లపక్షత్రయోదసిదినమున భరణినక్షత్రమున భారత యుద్ధంబు ప్రవృత్తంబయ్యె - నందు - కృష్ణపక్ష సప్తమి దినంబున శిఖండిని ముందు నిడికొని యర్జునుండు భీష్ముఁ బడ నేసె - నష్టమీదివసంబున భగదత్తుండును - నవమినాడు జయద్రథుండును - దశమినాఁ డభిమన్యుండును - యేకాదశి దినంబున సైంధవుండును - అర్ధరాత్రంబున ఘటోత్క చుండును ద్వాదశి వేకువఝామున విరాటద్రుపదులును -

ఆ మధ్యాహ్నంబున ద్రోణాచార్యుండును - త్రయోదశి దినంబున ననేక రాజసంఘంబులును చతుర్దశి మధ్యాహ్నంబున దుశ్శాసనుండును - నా సాయంసమయంబున కర్ణుండును రణంబునం బడిరి. కేవల దుర్యోధను సైన్యంబు దైన్యంబునొంది భేరీమృదంగాదివాద్య ఘోషంబులు లేక వీరాలాపంబులు మాని హర్షంబులు కోల్పోయి సూర్యుండు లేనిదినంబునుబోలె చంద్రుండును లేని రాత్రిపగిదిఁ గాంతివిహీనంబయి కనుపించె కమలపత్రంబులవంటి కన్నులుగలిగిన దుర్యోధన ముఖంబు కళావర్జితంబై కానంబడియె. ఇట్లు కౌరవసైన్యంబు కర్ణరహితంబై శోభింపకయుండె, * తదనంతరంబున - అమావాస్యయందు శకునియు నులూకుండును - సహదేవుని చేతఁ దెగటారిరి ఆ మధ్యాహ్నంబున శల్యుండు ధర్మరాజు చేతం జచ్చె-నా సాయంసమయంబున భీమసేనుని గదాఘాతంబునం దొడలు విరిగి దుర్యోధనుండు పడియెను - ధృష్టద్యుమ్నుండును - శిఖండియు ద్రౌపదీపుత్రులేవురు. నా రాత్రియం దశ్వత్థామ చేత హతులైరి. ఇవ్విధంబున పదునెనిమిది యక్షౌహిణులు పదునెనిమిది దినంబులు సమసె. భీష్ముండొక్కనాఁడు పదివేల గుఱ్ఱములును ౯ వేల యేనుఁగులును - వేవురు మూర్ధాభిషిక్తులయిన రాజులఁజంపి సమరంబు చాలించె. భీష్ముండు పది దివసంబులు - ద్రోణుండైదుదినంబులును - కర్ణుండు రెండుదిన

